

“ప్రాణమున్న ప్రతిదానిలోనూ చెట్టూచేమ, కొండాకోన, నదీలోయ, పశువు పక్షి అన్నింటిలో పవిత్రతను చూడగలగడమే నిజమయిన ఆధ్యాత్మికత. అదే ఆదర్శ సమాజ లక్ష్యం. ఈరోజు మనకి కావాల్సిన వాటన్నింటినీ ఎక్కడో దూరం నుంచి సమకూర్చుకుంటున్నాం. అందుకే, మన జీవం నిలుపుకోవడం కోసం ఇతర జీవుల్ని హింసిస్తున్నాం. మన సుఖాల కోసం ఎన్నో ప్రాణాల్ని కష్టపెడుతున్నాం. పశుపక్ష్యాదులు, జలచరాలు, సరీసృపాల నివాస స్థలాలన్నింటినీ నాశనం చేస్తున్నాం. మనిషికి హృదయమనేది స్పందించడానికి ఇవ్వబడిందే కాని చంపడానికి కాదు. ఇతర జీవుల్ని సంరక్షించడమే కాని భక్షించడం అతని పని కారాదు. అయితే, ప్రస్తుతం అతడు తన మేధస్సుని, జ్ఞానాన్ని జీవహింసకే ఉపయోగిస్తున్నాడు. ఆదిమానవులని పిల్చుకునే మన పూర్వీకులతో పోలిస్తే మనం చాలా వెనకబడి ఉన్నాం. ఈరోజు మనం పెద్దపెద్ద నగరాల్నీ, రైల్వే వ్యవస్థని ఇంకా అనేక వాటిని నిర్మించుకున్నాం. కానీ, ఆ క్రమంలో ఎన్నో జీవజాతులు నశించిపోయాయి. మనుషులుగా మన సుఖసంతోషాల కోసం వాటి బతుకులు ముగిసిపోయాయి. జీవజాతుల్ని కాపాడవలసిన మనుషులే వాటిని నాశనం చేసే పనికి ఒడిగట్టారు. కాన మనుషులకి నైతిక బాధ్యత ఉండాలని నా నమ్మకం.”

– సుందర్‌లాల్ బహుగుణ

# ప్రకృతి - శాశ్వత ప్రగతి

## (Ecology is Permanent Economy)

మూలం
సుందర్‌లాల్ బహుగుణ
విమలా బహుగుణ
జార్జ్ జేమ్స్

స్వేచ్ఛానువాదం
గౌరవ్

ప్రచురణ
మానవతా వేదిక
తెలుగు రాష్ట్రాలు

